**అవ :–** ఈశ్వరుఁడు సకలజీవులయందు సమానభావముగనుండక పక్షపాతముగ నుండఁ దగునా యని శిష్యుఁడడిగెడి ప్రశ్నకు సమాధానము చెప్పుచున్నారు.

**మ॥ సముఁడై యీశ్వరుఁడుండ నందఱ కిలఁ౯ సత్యాత్మ! ఖేదంబు మో**
**దము వేర్వేఱుగఁ జేయనేల యది భేదంబే కదా యిట్లన**
**న్నమ మొప్పన్విను పుత్త్ర! తండ్రి సుతులఁ౯ గాపాడు బాధించు వా**
**రిమనంబు ల్గని కాదె యీశుఁ డటుల న్ప్రీతిన్వ్యథల్చేయుటల్. 62**

**టీకా :–** సత్యాత్మ=కాలత్రయాబాధ్యమయిన బ్రహ్మస్వరూపుఁడగు పుత్త్రా, ఇలన్౯=పుడమియందు, ఈశ్వరుఁడు=సర్వనియామకుఁడైన భగవంతుఁడు, అందఱకు౯=ఎల్లప్రాణులకు, ఒగి౯=క్రమముగా, సముఁడై=సమభావముగలవాఁడై, ఉండ౯=ఉండఁగా, ఖేదంబు=దుఃఖము, మోదము=సుఖము, వేర్వేఱుగ౯=వారివారికి భిన్నభిన్నములుగా, చేయనేల=ఒనర్పనేల, అది=అట్లు చేయుట, భేదంబే కదా=పక్షపాతబుద్ధియే కదా, ఇట్లన౯= ఈ ప్రకారము శిష్యుఁడడుగఁగా, విను=వినుము, తండ్రి=తండ్రియైనవాఁడు, సుతుల౯=బిడ్డలను, వారిమనంబులు=వారియంతఃకరణములను, కనికాదే=తెలిసికొనిగదా, (మంచిగుణములుగల కొందఱిని) కాపాడు౯=రక్షించును, బాధించు౯=(చెడుగుణములుగల కొందఱిని) శిక్షించును, అటుల౯=పగలేని ఆ తండ్రివలెనె, ఈశుఁడు=భగవంతుఁడు, ప్రీతి౯=ప్రేమచేత, వ్యథలు=బాధలు, చేయుటలు=ఒనర్చుటలు అగును.

**తాత్పర్యము :–** త్రికాలజ్ఞానముగల శిష్యుఁడా! లోకమందు సమస్తమయిన మంచికార్యముల నియమించునట్టి భగవంతుఁడు సకలజీవులకు సమభావముగలవాఁడై యుండఁగా దుఃఖమును, సుఖమును భిన్నభిన్నములుగాఁ జేయనేల? ఆ ప్రకారముచేయుట పక్షపాతమౌను గదా యని శిష్యుఁడడుగఁగా బిడ్డలను వారివారియుల్లములను తెలిసి కాపాడుటకును కష్టపెట్టుటకును కొడుకులయందు ఆ యీశ్వరుఁడు పగలేని తండ్రివలె నగునని తాత్పర్యము.

**విశేషణము :–** అనఁగా తండ్రియైనవాఁడు తనబిడ్డలను వృద్ధికిఁదెచ్చుటకై వలయు ప్రయత్నములు చేయఁగా వారు తండ్రి చిత్తానుసారముగ నడుచుకొనినయెడల కొందఱకు సులభమైన పనులను కొందఱకు కష్టములగు పనులను వారివారికిఁ తగినట్లు నియమించి ఆ రీతిగానైన బ్రతుకుమని నిష్పక్షపాతముగఁ దలఁచునటుల ఆ ఈశ్వరుఁడును జీవుల యందు సమభావనకలవాఁడేయని భావము.

**అవ :–** ఈశ్వరుఁడు ఎల్లవారిని రక్షింపలేదనెడి శంకకు ఉత్తరము చెప్పఁబడుచున్నది.

**మ॥ తృటితారబ్ధవిశృంఖలా! యుడుపునే తృష్ణాపిపాసాతిదు**
**ర్ఘటశైత్యంబులఁ జేరకున్న దరికి న్గల్పాపగావహ్ని లెం**



=జీవకార్యములు, క్రమముగ౯=గురుకుల వాసము, తత్త్వమస్యాది మహావాక్యవిచారణము మొదలగునవి వరుసగా కల్గిన, తెల్విచే౯=అపరోక్ష సాక్షాత్కార జ్ఞానముచే, చెడిన౯=నశించిన, విముక్తులు గారె=జీవన్ముక్తులు గారా, ఈ సృతులు=ఈ మార్గములు, ఎఱుంగుము=తెలిసికొనుము.

**తాత్పర్యము :–** బ్రహ్మదేవుఁడు మొదలుగాఁగల సమస్తమైన వారియొక్క నాశముల యందును అనఁగా దశవిధప్రళయములయందు మాయాప్రతిబింబితుఁడైన పరబ్రహ్మము యొక్క కార్యములు నశించినను తిరుగా సృష్టికాలములయందు ఎవరు పుట్టుకలు లేకయున్నారు. ఆ తటస్థేశ్వరుని పనులు చెడక ప్రకాశించుకాలములయందు జీవకార్యము–లైన అహంకార మమకారాది సకల ద్వంద్వములు గురుకుల వాసమందు నేతి నేతియనెడు మహావాక్యోపదేశము చేత నశించిన జీవన్ముక్తులు అగుదురని తాత్పర్యము.

**అవ :–** ఈశ్వరకృత్యము లుండఁగా జీవకృత్యములైన కామాది దుర్వృత్తులు నశించిన ముక్తినొందుదురని తెలియఁజేయుచున్నారు.

**మ॥ శివకృత్యంబులు కల్పవేళలఁ జెడ౯ క్షీణించిరే జీవు లు**
**ద్భవము ల్చెందక దేశకాలతనువుల్ భాసిల్లు శ్రీరుద్ర స**
**ద్వ్యవహారంబులు గాన నుండ నవి జైవంబుల్ సుమోహాదులౌ**
**నవి క్షీణించిన ముక్తినొందరె యవిద్యం బాసి చిన్నిష్ఠచేన్. 59**

**టీకా :–** శివకృత్యంబులు=తటస్థేశ్వరుని కార్యములు, కల్పవేళల౯=ప్రళయకాలముల యందు, చెడ౯=నశించినను, జీవులు=ప్రాణులు, ఉద్భవములు=పుట్టుకలు, చెందక=పొందక, క్షీణించిరే=నశించారా, (అనఁగా నశించలేదనుట) దేశకాలతనువులు=దేశము, కాలము, తనువులు, శ్రీరుద్రసద్వ్యవహారంబులు గాన౯–శ్రీ=శోభాయుక్తమైన, రుద్ర=తటస్థేశ్వరునియొక్క, సత్=శ్రేష్ఠములయిన వ్యవహారాదులు=కృత్యములు, కాన౯=కాఁబట్టి, భాసిల్లు౯=ప్రకాశించును, అవి=ఆ శివకృత్యములు, ఉండ౯=ఉండఁగా, సుమోహాదులు=లెస్సయిన మోహము మొదలయినవి, జైవంబులు=జీవకృత్యములు, ఔ౯=అగును, అవి=ఆ జీవకృత్యములు, క్షీణించిన౯=నశించినను, అవిద్యంబాసి= అజ్ఞానమును విడిచి, చిన్నిష్ఠచే౯=ఆ జ్ఞాననిష్ఠచేత, ముక్తినొందరె=ముక్తిని పొందరా (అనఁగా పొందుదురనుట).

**తాత్పర్యము :–** తటస్థేశ్వరుని కార్యములు ప్రళయకాలములయందు నశించినను జీవులు పుట్టుకలు చెందక కల్పాంతరములయందు పుట్టుచునేయుందురు. దేశములు, కాలములు, దేహములు మొదలగునవియన్నియు శివకృత్యములు. అవియుండఁగా జీవకృత్యములైన కామము, క్రోధము, లోభము, మోహము, రాగము, ద్వేషము, ఈర్ష్య, అసూయ, దంభము, మదము, మాత్సర్యము, దర్పము, అహంకారము మొదలయినవన్నియు నశించినయెడల అజ్ఞానము తొలఁగి ముక్తినొందుదురని తాత్పర్యము.

**అవ :-** జీవేశ్వరవృత్తులను ఉపమానపూర్వకముగాఁ దెలియఁజేయుచున్నారు.

**శా॥ అశ్వత్థం బనుభూరుహంబు గల దందండోద్భవద్వంద్వ మా**
**శశ్వచ్ఛాఖి ఫలాళి మంచిదని యాశన్మెక్కు వేఱొండు ని**
**ర్విశ్వాసంబున మాని యుండు నని యీ రీతిꣳ శ్రుతుల్పల్కు స**
**ద్విశ్వస్తుత్య! యెఱుంగు మీ పదముల న్వేర్వేఱ జీవేశులన్. 60**

**టీకా :-** సద్విశ్వస్తుత్య–సత్=ఒప్పుచుండెడి, విశ్వ=ప్రపంచముచేత, స్తుత్య=కొనియాడఁదగిన శిష్యుఁడా, అశ్వత్థంబనుభూరుహంబు=రావిచెట్టు అను నొకచెట్టు, కలదు=(లోకమందు) కలదు, అందుꣳ=ఆ చెట్టునందు, అండోద్భవద్వంద్వము=పక్షుల జంట, (కలదు=కలిగియుండును) ఆశశ్వచ్ఛాఖిꣳ=ప్రకాశమయిన ఆ చెట్టునందలి, ఫలాళి=పండ్లయొక్క సమూహము, మంచిదని=బాగుబాగని, (ఒండు=ఒకపక్షి) ఆశꣳ=మిక్కిలి ఆసక్తితో, మెక్కుꣳ=తినును, వేఱొండు=మఱియొక్కటి, నిర్విశ్వాసంబునꣳ=దానియందలి ప్రేమవిడిచి, మానియుండుꣳ=తినకయుండును, అని=అని, ఈ రీతిꣳ=ఈ ప్రకారముగా, శ్రుతుల్=వేదములు, జీవేశులꣳ=జీవ శివులను, వేర్వేఱꣳ=వేఱువేఱు గాను, పల్కుꣳ=చెప్పును, ఈ పదములꣳ=ఈ ద్వివిధస్థానములను, ఎఱుంగుము= తెలిసికొనుము.

**తాత్పర్యము :-** లోకమందుఁ గొనియాడఁదగిన శిష్యుఁడా! లోకమందు శరీరమనెడి యొక రావిచెట్టుగలదు, ఆ చెట్టునందు రెండు పక్షులు వాసము చేయుచుండును. అందులో నొకపక్షి ఆ చెట్టుపండ్లను మంచివి మంచివని తినుచుండును. మఱియొకపక్షి ఆ పండ్లయందు విశ్వాసములేనిదై తినకయుండును. అని యీ ప్రకారముగా వేదము తినెడి పక్షిని జీవునిగాను, తిననిపక్షిని ఈశ్వరునిగాను వాక్రుచ్చునని తాత్పర్యము. శరీరము రావిచెట్టు అనుటకు ప్రమాణము "**శ్రు॥ ద్వాసుపర్ణా సయుజా సఖాయా సమానం వృక్షం పరిషస్వజాతే, తయోరన్యః పిప్పలం స్వాద్వత్త్యనశ్నన్నన్యో అభిచాకశీతి**" "**శ్లో॥ ఊర్ధ్వ మూలమథశ్శాఖమశ్వత్థం ప్రాహురవ్యయమ్, ఛందాంసి యస్య పర్ణాని యస్తం వేద స వేదవిత్, అధశ్చోర్ధ్వంచ ప్రసృతాస్తస్యశాఖా గుణప్రవృద్ధా విషయప్రవాళాః, అథశ్చ మూలాన్యనుసంతతాని కర్మానుబంధీని మనుష్యలోకే**" అని భగవద్గీత. ఈ చెట్టుయొక్క వేళ్లు ఊర్ధ్వముఖముగాను కొమ్మలు అధోముఖముగాను వ్యాపింపఁబడియున్నవి. వేళ్లు అనఁగా వెంట్రుకలు, కొమ్మలనఁగా చేతులు, కాళ్లు మొదలగునవి. దీనియందలి రెండు పక్షులు ఎవరనఁగా జీవుఁడు, ఈశ్వరుఁడు. ఫలములనఁగా సుఖదుఃఖములు. జీవకార్యములయిన కామాది జగద్వ్యాపారములయందు బుద్ధిని పోనియ్యక ఈశ్వరకార్యములయిన శమాదిసంపదలతోఁ గూడికొని యథార్థవస్తుజ్ఞానమును పొందవలయునని భావము.



**అవ :-** ఈశ్వరజీవకార్యములఁ దెలిసికొని జీవకార్యములవదలి ఈశ్వరనిష్ఠ యందుండు వారు చెందెడి ఫలమును జెప్పుచున్నారు.

**శా॥ కామక్రోధముఖారిషట్కము నహంకారంబు జీవక్రియా**
**గ్రామంబై తగు మూఢు లాక్రియల నా కామారి వంచుꣳ వృథా**
**తామిస్రం బగు దుర్గతిం బడుదు రీ తాత్పర్యభావేతరు**
**ల్భూమానందవిముక్తి నొందెదరు సంపూర్ణాత్మచిన్నిష్ఠచేన్. 61**

**టీకా :-** కామ...ట్కమునꣳ–కామ=కామము, క్రోధ=క్రోధము, ముఖ=మొదలుగాఁ గల, అరిషట్కము=అరిషడ్వర్గమును, అహంకారంబు=అహంకారము, జీవక్రియాగ్రామంబై–జీవ=జీవులయొక్క, క్రియా=పనులయొక్క, గ్రామంబై=సమూహమై, తగుꣳ=ఒప్పును, మూఢులు=అజ్ఞానులు, ఆ క్రియలꣳ=ఆ జీవకార్యములను, ఆ కామారివంచుꣳ=ఆ తటస్థేశ్వరునివని, వృథా=వ్యర్థమైన, తామిస్రంబు=అంధకారబంధురము, అగు దుర్గతిꣳ=అగునట్టి నరకమందు, పడుదురు=కూలుదురు, ఈ తాత్పర్యభావేతరుల్=ఈ తాత్పర్యమునకు వేఱైన బ్రహ్మజ్ఞానులు, సంపూర్ణాత్మ చిన్నిష్ఠచేꣳ=సమస్తమునందు బ్రహ్మభావముగల జ్ఞాననిష్ఠచే, భూమానందవిముక్తి నొందెదరు–భూమ=నిరతిశయమయిన, ఆనంద=సంతోషముతోఁగూడిన, విముక్తిꣳ=మోక్షమును, ఒందెదరు=పొందెదరు.

**తాత్పర్యము :-** కామక్రోధాది అరిషడ్వర్గమును నేననెడు అభిమానమును జీవకార్య సముదాయమై యొప్పును. ఈ జీవకార్యములను ఈశ్వర కార్యములని చెప్పుచుండువారు వ్యర్థమైన అంధకారమగు నరకములోఁబడుదురు. ఈ కార్యములు జీవకార్యములేగాని ఈశ్వరకార్యములుగావని వానిని విడిచి ఈశ్వరనిష్ఠ చేయుచుండెడి పెద్దలు నిరతిశయానందమైన మోక్షమును బొందుదురని తాత్పర్యము. అది యెట్లనఁగా ఒక ప్రభువు తనవద్ద ఒక పురుషుని కొలువునకుంచుకొని వానితో నీవు ప్రతిదినము చేయవలసిన పనులు ఇవియని స్పష్టముగాఁ దెలియఁజేసి అతనినడువడిని కనిపెట్టియుండెను. అంత కొంతకాలమునకు ఆ పనివాఁడు తనకు నియమించిన పనిని జాగ్రత్తగా చేయక ఇతరులతోఁగూడికొని జూదమాడుట, ముచ్చిలించుట, వ్యభిచరించుట మొదలగు దుష్కార్యముల యందు ప్రవేశించెను. ఆ ప్రభువు వానినడువడిని విచారించి దానికిఁ దగిన దండనకు పాత్రునిగాఁ జేయునుగదా? ఆ యజమానుఁడు తన నౌకరుచేసిన దుష్కార్యములకు దండన విధించి తాను ఆ పనులను చేయునా? అటువలెనే ఈశ్వరుఁడుఁకలుగఁజేసిన వేదము చెప్పెడి చొప్పున నడచుట ఈశ్వర కార్యమనియు వేదవిరుద్ధముగ నడచుట జీవకార్యమనియు ఎఱుఁగఁదగ్గది. కనుక ఈశ్వరాజ్ఞలగు వేదములు పలికెడిరీతిని నడుచుకొనెడివారు నిరతిశయానందమైన మోక్షపదవిని జెందుదురనియు, వేదవిరోధముగ ప్రవర్తించువారు దుర్గతిఁబొందుదురనియు భావము.

**అవ :-** సమస్తమును ఇయ్యఁదగిన శక్తిగల సత్కర్మము జ్ఞానమును ఇయ్యదా? విచారమెందులకని శిష్యుఁడడుగుచున్నాఁడు.

**శా॥ వైరాగ్యంబు తపంబు భక్తిమతినిర్వాణంబు యోగాంగముల్**
**సారూప్యాది చతుష్టయంబు సకలైశ్వర్యంబు నాకంబు ధ**
**ర్మారూఢాత్మ! యొసంగ సత్క్రియలు సామర్థ్యంబులై యుండు ని**
**స్సారంబైన విచారమేల తెలివి౯ సాధింపలేవా క్రియల్. 67**

**టీకా :-** ధర్మారూఢాత్మ=పుణ్యస్వరూపుఁడవయిన యాచార్యుఁడా, సత్క్రియలు= పుణ్యకర్మములు, వైరాగ్యంబు౯=సకలభోగపరిత్యాగమును, తపంబు౯=శరీరేంద్రియాదుల తపింపఁజేయుటయును, భక్తి౯=ఏకాంతానన్యబాహ్యరూప భక్తిని, మతి౯=మంచిబుద్ధిని, నిర్వాణంబు౯=మోక్షమును, యోగ=మంత్రలయహఠరాజము లనెడి చతుర్విధ యోగములను, అంగములు=వానికి పూర్వోత్తరాంగములయిన యమాద్యష్టాంగములను, సారూప్యాది చతుష్టయంబు౯=(వారివారి యుపాసనామూర్తుల సంబంధములయిన, సాలోక్య సామీప్య సారూప్య సాయుజ్యము లనెడు) చతుష్పదవులను, సకలైశ్వర్యంబు౯= అణిమాద్యష్టైశ్వర్యమును, నాకంబు౯=స్వర్గమును, ఒసంగ౯=ఇచ్చుటకును, సామర్థ్యంబులై యుండ౯=శక్తములైయుండఁగా, నిస్సారంబైన విచారము=సారములేని విచారము, ఏల=యేమి ప్రయోజనము, క్రియలు=ఆ పుణ్యకర్మములు, తెలివి౯=బ్రహ్మజ్ఞానమును, సాధింపలేవా=సాధింపఁజాలవా.

**తాత్పర్యము :-** పుణ్యస్వరూపుఁడవైన నా యాచార్యుఁడా! పుణ్యకర్మములును, సకల భోగపరిత్యాగమును శరీరేంద్రియాదులు తపింపఁజేయుటయును, ఏకాంతానన్య–బాహ్యములనెడి భక్తిత్రయమును, మంచిబుద్ధిని, ముక్తిని, మంత్రలయ హఠరాజ యోగములును పూర్వోత్తర యోగాంగములైన యమ, నియమ, ఆసన, ప్రాణాయామ, ప్రత్యాహార, ధ్యాన, ధారణ, సమాధులను, శైవ, శాక్త, గాణపత్య, సౌర, కాపాలిక, వైష్ణవములయొక్క సమయవాదుల దేవతలయొక్క చతుష్పదవులను, అణిమాద్యష్టైశ్వర్యములను, స్వర్గమును ఇచ్చుటకు శక్తిగలవైయుండఁగా హీనమైన విచారము ఏమి ప్రయోజనము. ఆ సత్కర్మములు బ్రహ్మజ్ఞానమును తెలియఁజేయనేరవా యని శిష్యుఁడడిగెనని తాత్పర్యము.

**అవ :-** ఆ ప్రశ్నకు దృష్టాంతపూర్వకముగా నుత్తరము చెప్పుచున్నారు.

**మ॥ మదగిన వాని రూపమును మర్మము నున్కి గుణంబు వేషము౯**
**మొదలగు చిహ్నము ల్దెలిసి మోహము నొందక చూడఁ జిక్కు వాఁ**
**డద నెఱిఁ గిట్లు గానక ప్రయాసముతోఁ గడ నెక్కి యాడిన౯**
**బదయుగ మెత్తిన న్బయలు ప్రాఁకినఁ జిక్కునె సాముఁ జేసినన్. 68**



**తటివైన న్నుద మీశ్వరుం దలఁచి యత్నం బెమ్మెయి న్జేయమి**
**న్ఘటనంబౌనె ప్రమాద మెవ్వరిది లోకంబందు వీక్షింపఁగన్. 63**

**టీకా :-** తృటితారబ్ధవిశృంఖలా–తృటిత=తెంపఁబడిన, ఆరబ్ధ=ప్రారబ్ధమనెడి, విశృంఖలా= సంకిళ్లుగలపుత్త్రుఁడా, కల్పాపగావహ్నులు–కల్ప=కల్పవృక్షము, ఆపగా=నది, వహ్నులు= అగ్ని, ఎంతటివైన౯=ఎంతసామర్థ్యముకలవియైనను, దరికి౯=వాని సమీపమునకు, చేరకున్న౯, తృష్ణాపిపాసాతి దుర్ఘటశైత్యంబుల౯–తృష్ణా=ఆశ, పిపాసా=దాహము, అతిదుర్ఘటశైత్యంబుల౯–అతిదుర్ఘట=మిక్కిలిపొందశక్యముగాని, శైత్యంబుల౯=చలిని, ఉడుపునే=పోఁగొట్టునా, ఈశ్వరు౯=స్వరూపతటస్థలక్షణలక్షితుఁడైన భగవంతుని, తలఁచి=పరోక్షాపరోక్షజ్ఞానముచేత స్మరించి, యత్నంబు=కర్మభక్తిజ్ఞానములచేత ప్రయత్నము, ఎమ్మెయి౯=ఏవిధముగానైనను, చేయమి౯=చేయకుండెనేని, ముదము=ఆనందము, ఘటనంబౌనె=కల్గునా, లోకంబందు౯=జగత్తునందు, వీక్షింపఁగ౯=చూడఁగా, ప్రమాదము =బుద్ధిమాంద్యము, ఎవ్వరిది=ఏవారిదియగును.

**తాత్పర్యము :-** ప్రారబ్ధకర్మమును విడిచిన శిష్యుఁడా! కల్పవృక్షము, నీరుగల ఏఱు, అగ్ని ఎంత సామర్థ్యముగలవియైనను వానిదగ్గఱకు చేరకుండిన వారియొక్క ఆశాపూర్తియు దాహము సహించఁగూడని చలియు తీరునా? (తీరవు) అటువలెనే భగవంతుని యుద్దేశించి సుఖమును పొందవలెననువారు ఏ ప్రయత్నముఁ జేయకుండిరేని ఈశ్వరుఁడు కల్గఁజేయునా? ఆ తప్పిదము చేరకుండినవారిదా? లేక ఈశ్వరునిదా? అనఁగా ఈశ్వరునిది కాదని తాత్పర్యము.

**అవ :-** జ్ఞానము కలుగుటకు చేయవలసిన ప్రయత్నమును మఱచుటను గుఱించి ఆచార్యులు చెప్పుచున్నారు.

**చ॥ విను మొకమాట యత్నమున విశ్వజనీనుఁడు మేలు సేయఁ జె**
**ప్పిన శ్రుతిమార్గ మేమఱక ప్రేమప్రియోక్తుల నమ్మి దుష్టవా**
**సనలఁ దొఱంగి వేత్తయయి సంసృతిఁ బాసి వెలింగిన న్సదా**
**జననము వీడి ముక్తుఁడగు సజ్జనసంస్తుత! పిమ్మట న్దగన్. 64**

**టీకా :-** సజ్జనసంస్తుత–సజ్జన=సత్పురుషులచేత, సంస్తుత=కొనియాడఁదగినవాఁడా! ఒకమాట=ఒకవచనము (నీవు ఆలకింపుము) యత్నమున౯=ప్రయత్నపూర్వకముగా, విశ్వజనీనుఁడు=ప్రణవార్థప్రతిపాదకుఁడైన పరబ్రహ్మము, మేలుసేయ౯=(తనయందు కల్పితులయిన చిదాభాసులకు) మంచిచేయను, చెప్పిన=వాక్రుచ్చిన, శ్రుతిమార్గము= ఉపనిషదర్థవిధిని, ఏమఱక=ఏమఱిపోక, ప్రేమ=కరుణతోఁగూడిన, ప్రియ=ప్రియుఁడైన ఆచార్యులయొక్క, ఉక్తుల౯=వాక్కులను, నమ్మి=విశ్వసించి, దుష్టవాసనల౯=మనోమలిన

సంకల్పములను, తొఱంగి=విడిచి, సంసృతిఁ=అహంకారాది దేహాంతసంసారమును, పాసి=(దానియందలి ఆశను) వదలి, వేత్తయయి=బ్రహ్మవిదుఁడయి, వెలింగిననగదా= ప్రకాశించిననుగదా, జననమువీడి=(సృష్టి మొదలు ఏతత్ క్షణపర్యంతము వచ్చిన) పుట్టుకవదలి, తగఁ=ఒప్పునట్లు, పిమ్మటఁ=పిదప, ముక్తుఁడగుఁ=జీవన్ముక్తుఁడగును.

**తాత్పర్యము :–** మంచిపుత్రుఁడా! నేను చెప్పెడి యొకమాట వినుము. ప్రయత్నపూర్వకముగా ప్రణవార్థప్రతిపాదకుఁడైన పరబ్రహ్మము ఎల్లవారికి మంచిఁజేయను వాక్రుచ్చిన భగవదాజ్ఞాపూర్వకమైన ఉపనిషదర్థవిధిని ఏమతిపోక కరుణతోఁగూడిన ఆచార్యునియొక్క మాటలను నమ్మి మనోవృత్తులను వదలి అహంకారాదులను బాసి బ్రహ్మవేత్తయయి ప్రకాశించిననుగదా పుట్టుకవదలి పిమ్మట జీవన్ముక్తుఁడగును.

**అవ :–** దేనిచేత ఈ జానోత్పత్తి కలుగునను ప్రశ్నకు ఉత్తరము.

**ఉ॥ ఏ గతి నీ వివేక ముదయించు ననఁ సువిచారదృష్టి నౌ**
**జాగొనరింపకున్న నది సల్పుట యెట్లన నే నెవండ నీ**
**భోగమయాంగమం దెది సుబుద్ధి జడం బెది రెండు గూడి యే**
**లాగిలఁ జల్పు బంధము చలంబున ముక్తి వెలుంగు టెట్టులౌన్. 65**

**టీకా :–** ఇలఁ=భూమియందు, ఏగతిఁ=ఏ ప్రకారముగా, ఈ వివేకము=ఈ యపరోక్ష సాక్షాత్కారము, ఉదయించుఁ=లభించును, అనఁ=ఆచార్యునిఁగూర్చి శిష్యుఁడడుగఁగా, సువిచారదృష్టిఁ–సు=లెస్సయగు, విచార=(జన్మాంతరసుకృతదుష్కృతరూప ప్రారబ్ధమువలన దుఃఖము ప్రాప్తించి అందువలన వైరాగ్యము జనించుటచే కలిగిన) చర్చయొక్క, దృష్టిఁ= వీక్షణమునందు, జాగొనరింపకున్నఁ=(పరిపక్వాంతఃకరణముగల యొకానొక పురుషుఁ డు) ఆలస్యము చేయకుండినను, ఔఁ=(ఆ జ్ఞానము) ఉదయించును, అది=ఆ విచారదృష్టి, చల్పుట=ఒనర్చుట, ఎట్లనఁ=ఎవ్విధముగాననఁగా, ఈ భోగమయాంగమందుఁ–ఈ= ఈ పరిదృశ్యమానమై ప్రాప్తించిన, భోగమయాంగమందుఁ=(ప్రారబ్ధరూపమై పాంచభౌతిక వికారమయిన) స్థూలదేహమందు, ఏను=(బ్రహ్మభిన్న ప్రత్యగాత్మస్వరూపుఁడనైన) నేను, ఎవండను=ఎవ్వఁడను, సుబుద్ధి=మంచిజ్ఞానము, ఎది=ఎద్ది, జడంబు=(వస్తు యథార్థమును విడిచి జగద్భ్రాంతితోఁగూడిన) అజ్ఞానము. ఎది=ఎద్ది, రెండుఁ=ఈ చిజ్జడములు రెండును, కూడి=ఒక్కటియై, చలంబునఁ=మోక్షవినాశకరమయిన యాగ్రహముచేత, బంధము= సంసృతిని, ఏలాగు=ఎట్లు, చల్పుఁ=చేయును, ముక్తి=జీవన్ముక్తి, వెలుంగుట= ప్రకాశించుట, ఎట్టులౌఁ=ఏలాగుకూడును?.

**తాత్పర్యము :–** భూమియందు ఎవ్విధముగా ఈ యపరోక్షజ్ఞానము కలుగునని ఆచార్యులను శిష్యుఁడడుగఁగా ఆలస్యముచేయక మంచివిచారముచేయుటచేత ఆ జ్ఞానముదయించును



(అనిన సువిచారముచేత కలుగును). ఆ విచారము ఏ విధమున కలుగునని యడుగఁగా ఈ అగపడకుండనుండిన నేనెవఁడను? అట్టి నన్నుఁ దెలిసికొను జ్ఞానమెద్ది? ఈ చిజ్జడములు రెండును ఒకటియైకలసి మోక్షమునకు వ్యతిరిక్తమైన సంసారబంధమును ఏ ప్రకారముచేయును. ఇది తొలఁగి జీవన్ముక్తి యెట్లు గలుగునని యోజించుటవలన నని తాత్పర్యము. భాష, తచ్ఛబ్దము, యచ్ఛబ్దము, ఏతచ్ఛబ్దము, యుష్మచ్ఛబ్దము అనెడి నాలుగు శబ్దములలో నణఁగియున్నది. తచ్ఛబ్దమనఁగా **అది**. యచ్ఛబ్దమనఁగా **ఏది.** ఏతచ్ఛబ్దమనఁగా **ఇది**. యుష్మచ్ఛబ్దమనఁగా **నీవు**. అస్మచ్ఛబ్దవాచ్యుఁడైన తానే యీ శబ్దములయందు ప్రవర్తించుచున్నాఁడని ఎఱుఁగవలయును.

**అవ :–** జ్ఞానము కలుగుటకు సత్కర్మములుండఁగా విచార మెందుకని శిష్యుఁడడిగెడి ప్రశ్నకు ఆచార్యులు ఉత్తరము చెప్పుచున్నారు.

**మ॥ గతజన్మార్జితపుణ్యకృత్యములచేఁ గల్గు న్వివేకం బనఁ**
**వితతం బైనవిచార మేల యన శ్రీవిశ్వేశ్వరప్రీతిఁ ద**
**త్కృతము ల్సల్ప మనంబు శుద్ధమగుఁ దద్వృత్తి న్విచారంబు స్వో**
**ద్ధతమౌ దాన వివేకమబ్బు నదె విద్యాకారణంబౌఁ గనన్. 66**

**టీకా :–** గతజన్మార్జితపుణ్యకృత్యములచేఁ–గత=(సృష్టిమొదలుకొని) కడచిన, జన్మ= (పుణ్యపాపమిశ్రములగు పుట్టువులలో మేలైన) మానుషజన్మములచేత, ఆర్జిత=(కాయిక, వాచిక, మానసిక, సాధనములచే) సంపాదింపఁబడిన, పుణ్యకృత్యములచే ఁ=యాగ యోగతపః క్రియాద్యనుష్ఠానములచేత, వివేకంబు=బ్రహ్మజ్ఞానము, కల్గుఁ=కలుగును, అనఁ=అనఁగా, వితతంబైనవిచారము–వితతంబైన=కొఱవడని, విచారము=చర్చ, ఏలయనఁ=ఎందుకని శిష్యుఁడడుగఁగా, శ్రీ విశ్వేశ్వరప్రీతిఁ–శ్రీ=శోభాయుక్తమైన, విశ్వ= నామరూపాత్మకమయిన జగత్తునకు, ఈశ్వర=నియామకుఁడైన భగవంతునికి, ప్రీతిఁ= ప్రియమగునట్లు, తత్కృతములు=ఆ యాగయోగానుష్ఠానాదులు, చల్పఁ=(ఫలాపేక్షలేక) చేయఁగా, మనంబు=అంతఃకరణము, శుద్ధమగుఁ=(ఘోర, మూఢ, వృత్తులవిడిచి) పరిశుద్ధమగును, తద్వృత్తిఁ=ఆ నిర్మలాంతఃకరణవృత్తియందు, విచారంబు=ఆలోచన, స్వోద్ధతమౌఁ=లెస్సగాఁబుట్టును, దానఁ=ఆ విచారమువలన, వివేకము=జ్ఞానము, అబ్బుఁ=కలుగును, అదే=ఆ విచారమే, కనఁ=చూడఁగా, విద్యాకారణంబౌఁ–విద్యా= బ్రహ్మవిద్యకు, కారణంబు=మొట్టమొదటిది, ఔఁ=అగును.

**తాత్పర్యము :–** గతించిపోయిన జన్మములచే సంపాదింపఁబడిన యాగయోగ తపః క్రియాద్యనుష్ఠానములచేత బ్రహ్మజ్ఞానము కలుగుచుండఁగా విచారమెందుకని శిష్యుఁ డడుగఁగా ఆ యాగయోగతపోనిష్ఠలచేత అంతఃకరణము శుద్ధమగునేగాని జ్ఞానము పుట్టదు. ఆ జ్ఞానమే మోక్షమునకు కారణమగునని ఆచార్యులు చెప్పిరని తాత్పర్యము.

చేత దానియందు కలిగిన కళంకమును పోఁగొట్టుటకు పయినఁజెప్పిన యుపకరణములు అవశ్యముగా కావలయునా? (అక్కఱలేదనుట). ఒకానొకసమయమందు కలుగునేని ఆ కల్మషము పోఁగొట్టుటకు మనస్సే చాలునని తాత్పర్యము. అనఁగా రాగి మొదలగువానికి చిలుముపట్టినపుడు ఆ చిలుమును పోఁగొట్టుటకు చింతపండు, ఇటికరాయిపొడి, బూడిద మొదలగువస్తువులతోఁ దోమి శుభ్రముచేసిననేగాని ప్రకాశము కలుగదు. ఆ చిలుము దానియందు కలుగుట నైజము. స్ఫటికపాత్రతుల్యపదార్థము. దానియందు అగపడెడి నానావిధములైన రంగులు మొదలగునవి విచారింపఁగా దానివి కావు గనుక దానిని ఁదోమి శుభ్రముచేయ నక్కఱలేదు. అటువలెనే అంతఃకరణము స్ఫటికపాత్రవంటిది. దానియందుఁదోఁచిన అజ్ఞానమనెడి కళంకమును బ్రహ్మవిచారముచేతఁ దొలఁగునని భావము.

**అవ :–** అజ్ఞానోన్మూలనమునకు సుజ్ఞానమే ముఖ్యముగాని కర్మమువల్లఁగాదని ఆచార్యులు శిష్యునకు రూఢిపఱచుచున్నారు.

> **మ॥ ఘనసచ్చిత్సుఖమం దసత్యజడదుఃఖంబు ల్సదా దోఁచుఁ జె**
> **ప్పిన సామ్యక్రియఁ గర్మసంచయ మసంవిత్స్నేహ మౌఁ గాన నా**
> **శన మొందించునె దాని జ్ఞానశుచి లేశం బంటిన న్నీఱుగా**
> **నొనరింపందగుఁ గాని యొంటనగునే యూహింపు మాత్మన్దగన్. 72**

**టీకా :–** చెప్పిన సామ్యక్రియన్=ముందుచెప్పిన దృష్టాంతమువలె, ఘనసచ్చిత్సుఖమందున్ =దేశకాలవస్తు పరిచ్ఛేదశూన్యమును, ప్రకాశాశ్రయమును నిరతిశయానందమును ఐన పరబ్రహ్మమందు, అసత్యజడదుఃఖంబులు–అసత్య=దేశకాలవస్తువికారమును, జడ= అధ్యాసమగు అవివేకమును, దుఃఖంబులు=బ్రహ్మసుఖాభావమును, (ఇవిమూఁడును) సదా= ఎల్లప్పుడు, తోఁచున్=(వివృత్తోపాదానకారణముగా) కానఁబడును, కర్మసంచయము= సత్క్రియలయొక్క సమూహము, అసంవిత్=అజ్ఞానమునకు, స్నేహము=మైత్రి, ఔన్=అగును, కానన్=కనుక, దానిన్=ఆ యజ్ఞానమును, నాశనమొందించునె=పోఁగొట్టునా, జ్ఞానశుచి= జ్ఞానాగ్ని, లేశంబు=కొంచెము, అంటినన్=తగిలిన, నీఱుగాన్=భస్మముగా, ఒనరింపందగుఁ గాని=చేయుటకు తగినదౌనుగాని, ఒంటన్=వేఱొకసాధనముచేతను, అగునే=ఔనా (కాదనుట), తగన్=ఒప్పునట్లు, ఆత్మన్=బుద్ధియందున, ఊహింపుము= తెలిసికొనుము.

**తాత్పర్యము :–** ముందుచెప్పిన దృష్టాంతమువలె సచ్చిదానందస్వరూపమయిన పరమాత్మ యందు అనృతజడదుఃఖములు ఎల్లప్పుడు వివృత్తోపాదానకారణముగాఁ గనఁ బడుచుండును. శ్రౌతస్మార్తాది సత్క్రియాసమూహము ఆ యజ్ఞానమునకు స్నేహము గనుక దానిని నాశనమొందించునా? జ్ఞానాగ్ని కొంచెము సోకినయెడల ఆ యజ్ఞానమును





**టీకా :–** మదగినవానిరూపమున్=మాఱువేషము వేసికొని దాఁగియుండు పురుషునియొక్క యాకారమును, మర్మమున్=గుట్టును, ఉన్కి=వాసస్థలమును, గుణంబున్=గుణమును, వేషమున్=వాఁడు ధరించియుండు వేషమును, మొదలగు=మొదలుగాఁగల, చిహ్నములు= గురుతులను, అదను=సమయమును, ఎఱిఁగి=తెలిసి, మోహమునొందక=విభ్రాంతిచెందక, చూడన్=చూడఁగా, వాఁడు=ఆ పురుషుఁడు, చిక్కున్=చిక్కును, ఇట్లు=ఈ ప్రకారము, కానక=చూడక, ప్రయాసముతోన్=కష్టముతో, గడనెక్కియాడినన్=గడమీఁద నెక్కియాడినను, పదయుగమెత్తినన్=తలక్రిందుగానుండి రెండుపాదములు పైకిఁజూఁచినను, బయలుప్రాఁకినన్=ఆకాశమునందు తొమ్ముతో జాఱినను, సాము న్జేసినన్= గరడిసాధనముఁజేసినను, చిక్కునే=ఆ పురుషుఁడు దొరకునా.

**తాత్పర్యము :–** మాఱువేషము వేసికొని దాఁగియుండు ఒకానొక పురుషుని వెదకిపట్ట వలెనను వారు ఆ పురుషుని యాకారమును, గుట్టును, వాఁడుండుస్థలమును, గుణమును, వాని వేషమును, ఇవి మొదలగు గుఱుతులను సమయమును నెఱిఁగి తాము భ్రమపడక చూడఁగా, ఆ పురుషుఁడు చిక్కును. ఈ ప్రకారము చూడక కష్టముతో గడమీఁద నెక్కియాడినను, కాళ్లుపైకెత్తి తలక్రిందుగా తపస్సుచేసినను, ఆకాశగమనముచేసినను, గరడిఁజేసినను, ఆ చోరపురుషునివలె దాఁగియున్న పరబ్రహ్మము దొరకునా యని తాత్పర్యము.

శ్రుతి॥ **"యో వేద నిహితం గుహాయాం పరమే వ్యోమన్" "పరేణ నాకం నిహితం గుహాయాం విభ్రాజదేతద్యతయోవిశంతి" "అంతస్థమాత్మానమజం న దృష్ట్వా భ్రమంతి మూఢా గిరిగహ్వరేషు". శ్లో॥ తీర్థే దానే జపే యజ్ఞే కాష్ఠే పాషాణకే సదా, శివం పశ్యతి మూఢాత్మా శివో దేహే ప్రతిష్ఠితః, సర్వత్రావస్థితం శాంతం న పశ్యతి చ శంకరమ్, జ్ఞానచక్షుర్విహీనత్వాదహో మాయాబలం మునే, శివమాత్మని పశ్యంతి ప్రతిమాసు నయోగినః , అజ్ఞానాం భావనార్థాయ ప్రతిమాః పరికల్పితాః"** అని సూతసంహిత. ఈ మొదలైన శ్రుతిస్మృతి వాక్యములచొప్పున ఆ పరబ్రహ్మము తనయందే యున్నదని తెలిసికొనవలయు నని భావము.

**అవ :–** పైని జెప్పిన దృష్టాంతమును దార్ష్టాంతికపూర్వకముగా విశదీకరించుచున్నారు.

> **శా॥ ఈరీతి న్పరమాత్మ చిహ్నముల నూహింపఁ బ్రమాణోక్తులన్**
> **సారాసారమతి న్గుహ న్వెలయు సత్సంవిత్సుఖం బబ్బు నా**
> **తీరుంగాక శ్రుతిస్మృతు ల్సదివిన న్దేవార్చన ల్సల్పినన్**
> **భూరిక్షోణిముఖాన్నదానములచేఁ బొల్పొందినం జిక్కునే. 69**

**టీకా :–** ఈరీతిన్=ఈ పైనఁజెప్పిన విధముగా, పరమాత్మచిహ్నములన్=పరమాత్మను

దెలియఁజేసెడి స్వరూపతటస్థ అతద్వ్యావృత్తిలక్షణముచే లేక సల్లక్షణము, చిల్లక్షణము, ఆనందలక్షణము, నిత్యలక్షణము, నిర్మలలక్షణము లనువానిచేతను, ప్రమాణోక్తులన్–ప్రమాణ=ప్రత్యక్షాది అష్టప్రమాణములలోపల బ్రహ్మప్రతిపాదకమైన ఉపనిషత్ప్రమాణ మందలి, ఉక్తులన్=అవాంతరవాక్యములు మహావాక్యములు అనెడి వచనములచేత, సారాసారమతిన్=సదసద్వివేకయుక్తమగు బుద్ధిచేత, ఊహింపన్=ఆలోచింపఁగా, గుహన్=అంతఃకరణమనెడి గుహయందు, వెలయు=ప్రకాశించెడు, సత్సంవిత్సుఖంబు=సచ్చిదానంద స్వరూపము, అబ్బున్=లభించును, ఆ తీరుగాక=ఆ విధముగాక, శ్రుతిస్మృతుల్సదివిన్–శ్రుతి=ఋగాదివేదములు, స్మృతులు=మానవాదిధర్మశాస్త్రములు, చదివిన్=(క్రమముగా పదక్రమజటాఘనములచేతను, ధర్మవిధానములచేతను) పఠించినను, దేవార్చనల్సల్పిన్–దేవ=ఆదిత్యాంబికాగణనాథ విష్ణుమహేశ్వరుల, అర్చనలు=(తత్తన్మతాంతరవిధములుగా) జపతపఃపూజావిధానములు, సల్పిన్=చేసినను, భూరిక్షోణిముఖాన్నదానములచేన్–భూరి=స్వర్గము, క్షోణి=భూమి, ముఖ=మొదలుగాఁ గల, అన్న=అన్నముయొక్కయు, దానములచేన్ =షోడశమహాదానములచేతను, పొల్పొందిన్=ప్రకాశించినను, చిక్కునే=సచ్చిదానందము లభించునా(లభించదనుట).

**తాత్పర్యము :–** పైనఁజెప్పిన విధముగా పరబ్రహ్మమును తెలియఁజేసెడి స్వరూప, తటస్థ, అతద్వ్యావృత్తులనెడి త్రివిధలక్షణములచేతను లేక సద్రూప, చిద్రూప, ఆనందరూప, నిత్యస్వరూప నిర్మలరూపములనెడి పంచక్షణములచేతను అష్టప్రమాణములలో మేలైన ఉపనిషత్ప్రమాణమందలి దేవతాంతకర జీవబ్రహ్మముల ప్రతిపాదించెడి అవాంతర వాక్యములచేతను, జీవేశ్వరైక్యమును ప్రతిపాదించెడి మహావాక్యములచేతను అనఁగా విధినిషేధజాతిగుణక్రియావాక్యములచేతను, దేశకాలవస్తుపరిచ్ఛేదశూన్యమగు సద్వివేకము చేతను, ఆలోచింపఁగా మనస్సనెడి గుహలో దాఁగియుండెడి పరబ్రహ్మ స్వరూపము ప్రాప్తించును. అటులుగాక అనృతజడదుఃఖాత్మకమగు అసద్వివేకముతోఁగూడి వేదములు, శాస్త్రములు, పురాణములు, ఇతిహాసములు మొదలయినవి క్రమముగా నేర్చినను పరబ్రహ్మస్వరూపము చిక్కదని తాత్పర్యము.

**అవ :–** సత్కర్మములు అజ్ఞానమును పోఁగొట్టఁజాలవా? తెలివియే అజ్ఞానమును పోఁ గొట్టునని చెప్పెదరే ఆ సంశయమును నివర్తింపఁజేయుమని శిష్యుఁడడుగుచున్నాఁడు.

**శా॥ తామ్రాదర్శకలంక మెల్లఁ జెడుఁ జేత న్దోమ నట్లాత్మ చి**
**త్సమ్రాడ్దేశిక! యెవ్వరైన మతిచేత న్దోమిరే యజ్ఞత**
**న్నమ్రత్వంబునఁ జేయు సత్క్రియలు నిర్ణాశంబు నొందింపవో**
**కమ్రజ్ఞాన మవిద్యఁ బాపు నన నిక్కం బెట్టులౌఁ దెల్పుమా. 70**



**టీకా :–** చిత్సమ్రాడ్దేశిక=జ్ఞానరాజ్యపరిపాలనఁ జేసెడు ఆచార్యుఁడా! తామ్రాదర్శ కలంకమెల్లన్=రాగియద్దమందలి చిలుమంతయును, చేతన్ దోమన్=సాధనముల గ్రహించి చేతితోఁ దోమినఁగదా, చెడున్=నశించును, అట్లు=ఆ ప్రకారము, ఆత్మన్=అంతఃకరణమును, మతిచేతన్=తెలివిచేతను, ఎవ్వరైనన్=ఏవారైనను, తోమిరే=రుద్దిరా, నమ్రత్వంబునన్=అణఁకువచేతను, చేయు=చేసెడి, సత్క్రియలు=శ్రౌతస్మార్తాది పుణ్య కర్మములు, అజ్ఞతన్=అజ్ఞానమును, నిర్ణాశంబున్=మిక్కుటమైన నాశమును, ఒందింపవో= చేయవా, కమ్రజ్ఞానము–కమ్ర=మనోహరమైన, జ్ఞానము=తెలివి, అవిద్యన్= అజ్ఞానమును, పాపునన్=పోఁగొట్టుననఁగా, నిక్కంబు=యథార్థము, ఎట్టులౌన్=ఏ ప్రకారమగును, తెల్పుమా=తెలియఁజేయుమా.

**తాత్పర్యము :–** జ్ఞానభూముల నేడింటిని పరిపాలించెడి యాచార్యుఁడా! రాగియద్దము నందుండెడి చిలుమంతయు చింతపండు బూడిద మొదలయిన సాధనములచేత దోమినను దాని చిలుముపోవును. ఆ ప్రకారమే అంతఃకరణమందుండెడి అజ్ఞానమును మంచి తెలివిచేత నెవరైనను తోమినారా? అణఁకువచేత చేయునట్టి పుణ్యకర్మములు అజ్ఞానమును పోఁగొట్టఁజాలవా? తెలివియైనది అజ్ఞానమును పోఁగొట్టునని చెప్పఁగా ఆ యథార్థము నాకెఱిగింపుమని శిష్యుఁడడిగెనని తాత్పర్యము.

**అవ :–** పై ప్రశ్నకు సమాధానము చెప్పుచున్నారు.

**చ॥ మలినము రాగియద్దమున మానక దోఁచ హరింప హేతువుల్**
**గల వొగిఁ గొన్ని ధాత్రిఁ బటికం బతినిర్మలమౌట దానికిన్**
**వలయునె యట్టిహేతువు లవశ్యము నొక్కతఱి న్వెలుంగఁ ద**
**త్కలుషము నెల్ల మాన్ప నది కల్పితమౌట మనంబు చాలదే॥**

**టీకా :–** ధాత్రిన్=భూమియందు, రాగియద్దమునన్=తామ్రపుటద్దమునందు, మలినము =చిలుము, మానక=విడువక, తోఁచన్=తోఁచినను, హరింపన్=దానిని బోఁగొట్టుటకు, హేతువులు=ఉపకరణములు, ఒగిన్=వరుసగా, కొన్ని=కొన్ని, కలవు=ఉన్నవి, పటికంబు= పటికపుబిళ్ళ, అతినిర్మలమౌటన్=మిక్కిలి స్వచ్ఛమగుటచేత, దానికిన్=ఆ స్ఫటికమునకు, అట్టిహేతువులు=పయిఁజెప్పిన యుపకరణములు,అవశ్యము=ముఖ్యముగా, వలయునే= కావలయునా, ఒక్కతఱిన్=ఒకకాలమందు, వెలుంగన్=కలిగెనేని, తత్కలుషమునెల్లన్=ఆ కల్మషమంతయు, మాన్పన్=పోఁగొట్టుటకు, అది=అది, కల్పితమౌటన్=కల్పింపఁబడిన దగుటచేత, మనంబు=మనస్సు, చాలదా=చాలదా(చాలుననుట).

**తాత్పర్యము :–** పుడమిలో తామ్రపుటద్దమునందు చిలుము ఎప్పుడును దోచుచుండును. దానిమాన్పుటకు కొన్ని యుపకరణములు కలిగియున్నవి. స్ఫటికపుబిళ్ళ యతినిర్మలమగుట

పుణ్యకర్మములచేత బ్రహ్మవిష్ణురుద్రాది దేవతలును, మిశ్రకర్మములచేత మనుష్యులును ఐనారయనియు చెప్పి బ్రాహ్మణ క్షత్ర వైశ్య శూద్రాదులకును, బ్రహ్మచారి, గృహస్థ, వానప్రస్థ, సన్యాసులకును నిర్ణయింపఁబడిన కర్మముల చేయుటవలన ఆనందము కలుగునని ఆ వేదమే యేల చెప్పెనని తాత్పర్యము. పశుపక్షివృక్షాదుల సంఖ్యలకు ప్రమాణము. "ప. వృక్షము లిఱువదిలక్షలు, పక్షులు పదిలక్షలుదకభవనవలక్షల్, లక్షత్రిదశము పశుక్రిమి, లక్షలపదియొండు నాల్గు లక్షలు మనుజుల్"

**అవ :–** శిష్యుఁడడిగిన పై ప్రశ్నకు ఆచార్యులు సమాధానము చెప్పుచున్నారు.

**శా॥ మ న్నెపు దజ్ఞతఁ దిను కుమారుని మాంద్యము మాన్పఁ దల్లి వి**
**ద్వన్నుత! దాఁచి యౌషధము వత్సలతఁ మధురోపహారముఁ**
**మన్ననఁ జూపి పిల్చుగతి మర్మముతో శ్రుతికర్మకాండముఁ**
**బన్నుగఁ జూపుఁ దత్క్రియలఁ బాయక చేతురు స్వర్గకాములై॥ 75**

**టీకా :–** విద్వన్నుత=విద్వాంసులచేత స్తోత్రములు చేయఁబడిన శిష్యుఁడా! ఎపుడు=ఎప్పుడు, అజ్ఞతఁ=తెలివిలేమిచేత, మన్ను=మన్ను, తిను=భక్షించెడు, కుమారుని=బిడ్డయొక్క మాంద్యము=అజీర్ణరోగమును, వత్సలతఁ=ప్రేమాతిశయత్వముచేత, మాన్పఁ= నివారించుటకు, తల్లి=జనని, ఔషధము=నూతినమందును, దాఁచి=మఱుఁగుపెట్టి, మన్ననఁ=లాలనచేత, మధురోపహారముఁ=మాధుర్యయుక్తమైన భక్ష్యమును, చూపి= కనుపఱచి, పిల్చుగతిఁ=పిలుచువిధముగానే, శ్రుతి=వేదము, మర్మముతోఁ=బాగుచేయ వలెనను స్వాభిప్రాయమును మఱుఁగుపెట్టిన తలంపుతో, కర్మకాండముఁ=యాగాది కర్మములను దెలిపెడిభాగమును, చూపుఁ=కనుపఱచును, తత్క్రియలన్=ఆ కర్మకాండ మందు ఁజెప్పిన తపోయాగయోగకృచ్ఛ్రచాంద్రాయణాది పుణ్యకర్మములను, స్వర్గకాములై= దేవలోక భోగాభిలాషగలవారై, పాయక=విడువక, చేతురు=(పామరకర్మఠులు) ఒనరింతురు.

**తాత్పర్యము :–** ఆత్మానాత్మ వివేకముగల పండితులవల్ల స్తోత్రము చేయఁబడిన శిష్యుడా! ఎల్లప్పుడును వివేకములేనందున మన్ను తినెడు బిడ్డయొక్క మాంద్యవ్యాధిని పోఁగొట్టుటకు దయగల తల్లి కారణముగా నుండెడి మందునునూరి ఆ మందును వానికిఁ దెలియ కుండునటులు దాఁచిపెట్టి తీపుగల అతిరసమును జూపి దగ్గఱకు తీసికొని యేమఱపాటుచేసి ఆ యతిరసమును పాఱవేసి మందును పోసినటులు వేదము స్వర్గఫలము మీకుఁ గలుగును. సత్కర్మములు చేయుఁడని చూపి బ్రహ్మకాండమును మఱుఁగుచేయ అది తెలియని కర్మఠులు బ్రహ్మకాండమును విడిచి "జ్యోతిష్టోమేన స్వర్గకామో యజేత" అనురీతిని స్వర్గఫలాపేక్షలు గలవారై విధి నిషేధ ప్రాయశ్చిత్తకామ్యములైన శ్రౌతస్మార్త నిత్యనైమిత్తిక కర్మములు చేయుచుందురని తాత్పర్యము.



భస్మము చేయునుగాని కర్మములు మొదలయిన సాధనములచేత ఆ యజ్ఞానము తొలఁ గునా? నీ బుద్ధియందు దీనిని చక్కఁగాఁ దెలిసికొనుమని తాత్పర్యము.

**శ్లో॥ యథాపంకేన పంకాంభః సురయావాసురావృతః**
**భూతహత్యాం తథైవైకాం న యజ్ఞైర్మార్ష్టుమర్హతి॥** – అను భాగవతశ్లోకార్థము చొప్పున అడుసుచేత అడుసును కడిగిన నా మురికి పోనిచందమున కల్లు కుండను కల్లుతోఁ దోమి కడిగిన దానికంపు వదలని విధమున కర్మముచేత నజ్ఞానము నశించదని భావము.

**శ్లో॥ జ్ఞానాగ్నిః సర్వకర్మాణి భస్మసాత్ కురుతే తథా**
**యథైధాంసి సమిద్ధోఽగ్నిర్భస్మసాత్కురుతేఽర్జున॥** – అను భగవద్గీతావాక్యము చొప్పున అగ్నిచేత కట్టెలు భస్మమైనలాగున జ్ఞానాగ్ని సోఁకినయెడల సర్వకర్మములును భస్మమౌనని తెలియునది. ఉపాదానము పరిణామోపాదానమని, వివృత్తోపాదానమని ద్వివిధము. పరిణామోపాదానము (పాలు పెఱుగైనట్లు) గనుక వానిని ఈశ్వరునికిఁ జెప్పరాదు. అట్లు చెప్పిన పక్షమున పాలుచెడి పెఱుగైనటుల ఈశ్వరుఁడును చెడును. కొందఱు ప్రకృతిని ఉపాదానమందురు. ప్రకృతి ఉపాదానమయినయెడల కుమ్మరవానికి ముందే మన్ను కలిగి యుండినట్లు ఈశ్వరునికిముందే ప్రకృతియుండవలెను. అట్లు చెప్పినయెడల ఈశ్వరుఁడు మొదటివాఁడు కాకపోవును. లేక రెండును వేఱనిన ద్వైతమౌను. **"ఏకమేవాద్వితీయం". "బ్రహ్మైవాహమిదం జగచ్చ సకలం". శ్లో॥ బహూని మే వ్యతీతాని జన్మాని తవ చార్జున, తాన్యహం వేద్మి సర్వాణి నత్వం వేత్థ పరంతపః॥** అనఁగా సమస్తజాతులయందు పుట్టుచు అనేకనామరూపములఁ జెందియుండునది పరబ్రహ్మమేయనియు, సర్వము బ్రహ్మమేయనియు, రెండవది లేదనియు నిర్ధారణ మగుచున్నది కాఁబట్టి యీ ప్రమాణములకు విరోధము కలుగును. అందుచేత అట్లుచెప్ప చొప్పడదు. వివృత్తోపాదానమనఁగా రజ్జునందు సర్పముగాఁ దోఁచినటులు కారణమందుఁ గార్యము కనఁబడి విచారించిన పిమ్మట సర్పములేక రజ్జువే యైనట్లు కారణమైన బ్రహ్మమందుఁ దోఁచిన ప్రపంచమును విచారణ చేయఁగా కార్యమైన ప్రపంచము శూన్యమై కారణమగు బ్రహ్మమే నిలిచినట్లగుటవలన నిచట వివృత్తోపాదానమని చెప్పఁబడెను. **"అణోరణీయాన్మహతో మహీయాఁ"** అను శ్రుత్యర్థము చొప్పున నిద్ర గడచినతోడనే సూక్ష్మముగఁ దోఁచి ఆ వెనుక గొప్పగ నగపడినచందమున **"అహం బ్రహ్మాస్మి"** ఆకారవిజ్ఞానము కలుగుటయని భావము. **"శ్లో॥ యథోర్ణనాభిస్సృజతే గృహ్యతే చ యథా పృథివ్యా మోషధయ స్సంభవంతి, యథా సతః పురుషాత్కేశలో మా స్తథాక్షరాత్సంభవతీహ విశ్వమ్"** అను ప్రమాణము చొప్పున సాలెపురుగు తనకుతానే నూలు పుట్టించుటవలన నుపాదానకారణము తానే అయి ఆ నూలితో విచిత్రముగా నేయుటచే నిమిత్తకారణము

తానే అయి ఆ నేంతకు తురీవేమాదులు తానే యగుటచే సహకారి కారణముకూడ తానే అయినవిధమున యీ మూఁడు కారణములు ఆ యీశ్వరునియందే యున్నవి గనుక **"సదసచ్చాహమర్జున"** అనెడి గీతావచనమురీతిని ఎవఁడీ జీవేశ్వర జగద్రూపకార్యములు తానే యని తెలియుచున్నాఁడో వాఁడే ముక్తుఁడని భావము.

**అవ :–** విచారణచేత జడభావమైన అజ్ఞానము నశించునని దృష్టాంతపూర్వకముగఁ దెలియఁజేయుచున్నారు.

**శా॥ ఇంట న్గన్మఱుఁ గైనవస్తు వొగిఁ దా నేనూఱువేలేండ్లుగాఁ**
**గంటꣳ గూరుకురాక యేడ్చిన ధర న్గన్పట్టునా జ్ఞప్తి వే**
**వెంట న్జేయక యట్లు జ్ఞాన మది ప్రాప్తించుꣳ సుతా! చర్చచే**
**జంటల్గాఁ జలుప న్క్రియ ల్గలుగునే జాడ్యంబు వో నేర్చునే. 73**

**టీకా :–** సుతా=కుమారా, ధరꣳ=భూమియందు, తాꣳ=ఒకానొక పురుషుఁడు, ఇంటꣳ= గృహమునందు, కన్మఱుఁగైనవస్తువు=కంటికి అగపడని పదార్థమును, ఒగిꣳ=వరుసగా, ఏనూఱువేలేండ్లుగాꣳ=ఏ నూఱువేల సంవత్సరములుగాను, (అనఁగా పెక్కేఁడులు) కంటꣳ=కంటియందు, కూరుకురాక=నిద్రపట్టక, ఏడ్చినꣳ=దుఃఖించినను, జ్ఞప్తిꣳ= జ్ఞాపకమును, వేవెంటꣳ=వెంబడివెంబడిగా, చేయక=ఒనర్చక, కన్పట్టునా=అగుపడునా, అట్లు=ఆ ప్రకారము, క్రియలు=(కృచ్ఛచాంద్రాయణ నిత్యనైమిత్తిక కామ్య విధి నిషేధప్రాయశ్చిత్తములు మొదలైన కులోచిత వేదోక్త) సత్కర్మములు, జంటల్గాఁ జలుపꣳ=రెండింతలుగా చలిపినను, జ్ఞానము=సద్వివేకము, అది=అది, కలుగునే= లభించునా, జాడ్యంబు=జడభావమైన అజ్ఞానము, పోనేర్చునే=పోనోపునా, చర్చచేꣳ= విచారణచేతను, ప్రాప్తించుꣳ=(ఆ జ్ఞానము) కలుగును.

**తాత్పర్యము :–** కుమారా! భూమియందొక పురుషుఁడు తన ఇంటిలో నొకచోటను దాఁచిన పదార్థము కనఁబడకపోయిన వరుసగా ననేకవత్సరములు నిదురింపక దుఃఖించిన పెట్టినచోటు జ్ఞాపకమునకురాక కనఁబడునా? ఆ రీతిగానే సత్కర్మములు ఇబ్బడిబ్బడిగాఁ జేయుటవలన సద్వివేకము కలుగునా? జడభావమైన అజ్ఞానమును పోఁగొట్టునా? ఆ జ్ఞానము విచారణచేతనే సంప్రాప్తమగునని తాత్పర్యము. ఇందులకు దృష్టాంతము గాయత్రీ మహామంత్రమును ఉపదేశము చేయించుకొని దానియర్థము తెలిసికొనుటకై నూఱుమార్లు గంగాస్నానముచేసినను, సేతుయాత్రకుఁబోయినను, పంచాగ్ని మధ్యమందు తలక్రిందుగాఁ దపస్సు చేసినను, ఆ గాయత్రియొక్క అర్థము దెలిసినవారిని అడిగి తెలిసికొనువఱకుఁ దెలియనివిధమున కర్మములు విశేషముగఁ జేయుటవలన జ్ఞానము రానేరదు గనుక ఆత్మానాత్మ విచారముచేతనే ఆ జ్ఞానము పుట్టుచున్నదని స్ఫురించుచున్నది.



**"శ్లో॥ మన ఏవ మనుష్యాణాం కారణం బంధమోక్షయోః**
**బంధాయ విషయాసక్తం ముక్తేర్నిర్విషయం మనః॥** –అనఁగా మనుష్యులకు మనస్సే మోక్షమునకును, బంధమునకును హేతువు. విషయాదులతోఁ గూడుటయే బంధముకొఱకనియు, విషయాదులయందు వాంఛ వదలుటయే ముక్తికొఱకనియు భావము. మోక్షమునకు జ్ఞానము, ఆఁకలిగొన్నవానికి వండి సిద్ధమైన అన్నమువంటిది గనుక **"జ్ఞానాజ్ఞానే విచార్యేతే కారణే బంధమోక్షయోః"** అను శ్లోకార్థము రీతిని ఎవఁడైతే విచారణముచేత అజ్ఞానమును నశింపఁజేసికొని మోక్షమునకు సాక్షాత్సాధనమగు సుజ్ఞానమును లభింపఁజేసికొనుచున్నాఁడో వాఁడే జీవన్ముక్తుఁడని యెఱుఁగఁదగ్గది.

**అవ :–** వేదము బ్రహ్మజ్ఞానమే నిరతిశయానందమును ఇచ్చునని చెప్పి మరల కులాశ్రమ ధర్మమే ప్రమోదమొసఁగునని ఎందుకుఁ జెప్పవలయునని శిష్యుఁడడుగుచున్నాఁడు.

**చ॥ ప్రమద మొసంగు జ్ఞానమని పాపములꣳ బశుపక్షివృక్షస**
**త్కృమిజలజంతువు ల్సురలు కేవలపుణ్యముల న్నరు ల్సుమి**
**శ్రమముల నొందు రంచు శ్రుతి చాటి కులాశ్రమధర్మమార్గమే**
**క్రమముగ మోద మిచ్చునని కర్మవిధి న్వచియింప నేలకో. 74**

**టీకా :–** శ్రుతి=వేదము, జ్ఞానము=బ్రహ్మజ్ఞానము, ప్రమదము=నిరతిశయానందమును, ఒసంగుꣳ=ఇచ్చును, అని=అని చెప్పియు, పాపములꣳ=హింసాది పాపకర్మములచేత, పశు...తువులు–పశు=ముప్పదిలక్షల భేదములుగల ధేన్వాది చతుష్పాదజంతువులును, పక్షి=పదిలక్షల భేదములుగల హంసాది పక్షులును, వృక్ష=ఇరువదిలక్షల భేదములుగల అశ్వత్థాదివృక్షములును, సత్=విద్యమానమైన, కృమి=పదునొకండు లక్షల భేదములుగల శేషాదికీటకములును, జలజంతువులు=తొమ్మిదిలక్షల భేదములుగల తిమి, తిమింగిలాది మత్స్యములును, కేవలపుణ్యములꣳ=ముఖ్యములయిన సత్క్రియలచేత, సురలు=విష్ణ్వాది దేవలోకవాసులైన ముప్పదిముక్కోటిదేవతలును, సుమిశ్రమములꣳ–సు=లెస్సయైన, మిశ్రమములꣳ=పుణ్యపాపసంకలితకర్మములచేత, నరులు=నాలుగులక్షల భేదములుగల మనుష్యులును, ఔదురంచుꣳ=ఔదురని, చాటి=ప్రసిద్ధపఱచి, కులాశ్రమధర్మమార్గమే–కుల= బ్రాహ్మణాది చాతుర్వర్ణ్యమునకును, ఆశ్రమ=బ్రహ్మచర్యాది చతురాశ్రమములకును, ధర్మ= తగిననడవడికయొక్క, మార్గమే=అనుసరణయే, క్రమముగꣳ=వరుసగా, మోదము= ఆనందమును, ఇచ్చునని=ఒసంగునని, కర్మవిధిꣳ=కర్మవిధాయకమును, వచియింప నేలకో=పలుకనేల.

**తాత్పర్యము :–** వేదము బ్రహ్మజ్ఞానమైన నిరతిశయానందమును నిచ్చునని చెప్పియు దాని విడిచి పాపకర్మములచేత, తరు, పాషాణ, జలచర, క్రిమి, పశు, పక్షులను,

**తాత్పర్యము :–** గురుశ్రేష్ఠుఁడవైన యాచార్యుఁడా! పుట్టుట, గిట్టుటలు గల జగము అజ్ఞానస్వరూపము. కర్మమునకును, అజ్ఞానమునకును స్నేహము కలిగియున్నది. జ్ఞానమునకును, అజ్ఞానమునకును విరోధమగును గాన చంద్రునియందలి చంద్రికతో కళంకము చేరియుండునటుల జ్ఞానాజ్ఞానములు రెండును జతగాఁగూడి ఆకాశము మొదలైన జగమును చేయుటకుఁ దగునా? ఇది ఆశ్చర్యముగదా? యీ యర్థమును స్పష్టముగాఁ దెలియఁజేయుమని తాత్పర్యము. అనఁగా అస్థిరమైన ప్రపంచము అజ్ఞానస్వరూపము. ఆ యజ్ఞానమునకును, కర్మమునకును చుట్టఱికము కలిగియుండుటవలన జ్ఞానమునకును, అజ్ఞానమునకును మైత్రి పొసగదు. కావున కర్మ మజ్ఞానమును పోఁగొట్టఁజాలదు. ఆ రెండును ఒక్కటిగాఁ గూడి జగత్సృష్టిచేయుట ఆశ్చర్యము గనుక నీ సందేహము నివర్తిచేయుమని శిష్యుఁడడుగుచున్నాఁడు.

**అవ :–** శిష్యుఁడడిగిన పై ప్రశ్నకు నుత్తరము చెప్పుచున్నారు.

**మ॥ పరఁగుఁ స్వప్రభఁ జేతనం బదె స్వరూపప్రజ్ఞనా వృత్తినా**
**స్థిరతత్ప్రజ్ఞయె వృత్తియౌ నితరమై చెన్నొందలే దెందులఁ**
**వరతత్ప్రజ్ఞ యవిద్యకుం బగ యగుఁ వత్సా! తగఁ సుప్తియం**
**దరయ న్జూడమె వృత్తియై యది యవిద్యం బాపు, నిష్ఠ న్జుమీ. 80**

**టీకా :–** వత్సా=కుమారా, చేతనంబదె=ఆ బ్రహ్మజ్ఞానమే, స్వప్రభఁ=తనప్రకాశముచేత, స్వరూపప్రజ్ఞనాఁ=స్వరూపజ్ఞానమనియు, వృత్తినాఁ=వృత్తిజ్ఞానమనియు, పరఁగుఁ=ఒప్పును, తత్ప్రజ్ఞయె=ఆ స్వరూపజ్ఞానమే, వృత్తియౌన్=వృత్తిజ్ఞానమనునదియౌను, ఎందులఁ=ఏ శాస్త్రములయందును, ఇతరమై=ఇంకొకటియై, చెన్నొందలేదు=ప్రకాశింపలేదు, వరతత్ప్రజ్ఞ–వర=శ్రేష్ఠమైన, తత్ప్రజ్ఞ=ఆ స్వరూపజ్ఞానమే, అవిద్యకుఁ=అజ్ఞానమునకు, పగయగుఁ=వైరముకలదియగును, అరయఁ=ఆలోచింపఁగా, సుప్తియందుఁ=కారణశరీరకార్యమైన సుషుప్తియవస్థయందు, తగఁ=ఒప్పునట్లుగా, చూడమే=కనమా, అది=ఆ స్వరూపజ్ఞానము, వృత్తియై=వృత్తిజ్ఞానమై, నిష్ఠఁ=నిర్వికల్ప సమాధిచేత, అవిద్యఁ=అజ్ఞానమును, పాపుఁ=పోఁగొట్టును.

**తాత్పర్యము :–** కుమారా! భూమియందు బ్రహ్మజ్ఞానమే తన ప్రకాశముచేత వృత్తిజ్ఞాన మనియు, స్వరూపజ్ఞానమనియు రెండువిధములుగా నుండును. ఆ స్వరూపజ్ఞానమే వృత్తిజ్ఞానమౌను. ఏ శాస్త్రములయందును ఒకటిగాఁ జెప్పెను గాని భిన్నములుగాఁ జెప్పలేదు. ఆ స్వరూపజ్ఞానమే అజ్ఞానమునకుఁ బగయగును. యోజింపఁగా కారణశరీర కార్యమైన సుషుప్తియందు ఒప్పియున్నటులు తెలిసికొనుము. ఆ స్వరూపజ్ఞానమే వృత్తిజ్ఞానమై నిర్వికల్పసమాధిచేత అజ్ఞానమును పోఁగొట్టునని తాత్పర్యము. **"అవిరోధితయా**



**అవ :–** భోగేచ్ఛగలవారలకు స్వేచ్ఛావిహారములు స్వాభావికములని ఆచార్యులు చెప్పుచున్నారు.

**శా॥ భోగాసక్తుల కెద్దియైన దిన సంభోగింప స్వాభావ్య మౌ**
**రాగం బొప్ప విధించునా శ్రుతి కుమారా! వారి కా కృత్యము**
**ల్వేగ న్మారుత! వీచు మేర్చుము శిఖీ! వేమా! విసం బందుమా**
**బాగౌ కాకమ! నల్పు గమ్మనిరె యెవ్వారైన నూహింపుమా. 76**

**టీకా :–** కుమారా=పుత్రా, భోగాసక్తులకుఁ=భోగమునందిచ్ఛగలవారలకు, ఎద్దియైనఁ =దేనినైనను, తినఁ=భుజించుటకును, సంభోగింపఁ=ఏ స్త్రీనైన అనుభవించుటకును, స్వాభావ్యమౌఁ=నైసర్గికమౌను, శ్రుతి=వేదము, వారికిఁ=ఆ భోగాసక్తులకు, రాగంబొప్పఁ= అనురాగమొప్పునటులు, ఆ కృత్యములు=ఆ పనులు, విధించునా= నిర్ణయించునా, ఎవ్వారైనఁ=ఎవ్వరైనను, వేగఁ=శీఘ్రముగా, మారుత=వాయువా, వీచుము=విసరుము, శిఖీ=అగ్నీ, ఏర్చుము=దహింపుము, వేమా= వేఁపచెట్టా, విసంబు=చేఁదును, అందుమా=పొందుమా, బాగౌకాకమ=మంచిదైన వాయసమా, నల్పుగమ్ము=నల్లరంగు గలదిగా నుండుము, అనిరె=అని విధించిరా, ఊహింపుమా=నీవు దెలిసికొనుము.

**తాత్పర్యము :–** పుత్రా! భోగమునందిచ్ఛగలవారలకు విధినిషేధములను యోజింపక యేవస్తువులనైన భుజించుటయును, ఏ జాతి స్త్రీలనైనను పొందుటకును వారికి స్వభావములే ఔను. వేదము ఆ భోగాసక్తులకు ఇష్టము వచ్చినటులు ఆ పనులను జేయుమని విధియించునా? ఎవ్వరైనను, వేగముగా గాలిని విసరుమని, అగ్నిని దహింపుమని, వేఁపచెట్టును విషముకమ్మని, కాకమును నల్లరంగుగలదిగా నుండుమని విధియించిరా? గనుక అవి వానివానికి స్వాభావికగుణములైనట్లు భోగాసక్తులకు **"కామాతురాణాం న భయన్న లజ్జా"** అనునట్లు స్వేచ్ఛగా తినుటయు, అనుభవించుటయు స్వభావములని నీవు తెలిసికొనుమని తాత్పర్యము. విధి యనఁగా వేదము చెప్పెడి చొప్పున నడుచుట. నిషేధమనగా వేదవిరోధముగఁ బ్రవర్తించుట.

**అవ :–** సర్వసంగపరిత్యాగమే వేదముయొక్క ముఖ్యాభిప్రాయమని ఆచార్యులు దెల్పుచున్నారు.

**మ॥ మధుమాంసేచ్ఛలు యాగకార్యములఁ గామక్రీడ లుద్వాహస**
**ద్విధువందు న్దగఁ దీర్చుకొ మ్మనుచు వేదంబుల్ తదన్యక్రియ**
**ల్విధియించు న్దొలఁగ న్జగద్ధితముకై వేద్క న్దదీయేచ్ఛలఁ**
**బుధసంస్తుత్య! సమస్తము న్విడుచుటే ముఖ్యంబె యౌ వానికిన్. 77**

**టీకా :–** బుధసంస్తుత్య–బుధ=పండితులచేత, సంస్తుత్య=కొనియాడఁదగిన శిష్యుఁడా, మధుమాంసేచ్ఛలు–మధు=సురాపానమందును, మాంస=పలలమందును, ఇచ్ఛలు= అభిలాషలు, యాగకార్యములఁ=యజ్ఞకార్యములయందును, కామక్రీడలు=మన్మథ కేళులయందభిలాషలు, ఉద్వాహసద్వధువందుఁ–ఉద్వాహ=పెండ్లిచేసికొన్న, సత్=శ్రేష్ఠమైన, వధువందుఁ=కులస్త్రీయందును, తగఁ=ఒప్పునటులు, తీర్చుకొమ్ము=నెఱవేర్చుకొమ్ము, అనుచుఁ=అనుచు, తదన్యక్రియలు=యజ్ఞశిష్టములుగాక స్వేచ్ఛగా తినుట, అన్యస్త్రీలయందు భోగించుట మొదలగు పనులను, తొలఁగఁ=విడుచుటకుఁగాను, వేదంబులు=శ్రుతులు, వేడ్కఁ=సంతోషముతో, జగద్ధితముకై=జగత్తులోని వారి ఇష్టమునకై, విధియించుఁ= నిర్ణయము చేయును. వానికిఁ=ఆ వేదములకు, సమస్తముఁ=సర్వాభిలాషలను, విడుచుటే=పరిత్యాగముసేయుటే, ముఖ్యంబె యౌఁ=శ్రేష్ఠమగును.

**తాత్పర్యము :–** విద్వాంసులవల్లఁ గొనియాడఁదగినశిష్యుఁడా? మధుమాంసముల యందిచ్ఛ గలిగియుండిన యజ్ఞములు చేసి భుజించుము. భోగములయందిచ్ఛ గలిగియుండిన విధ్యుక్తముగా వివాహముచేసికొని ఆ స్త్రీయందు భోగించుమని చెప్పుచు యజ్ఞశిష్టములుగాని కార్యములను విడుచుటకై జనులహితమును గుఱించి వేదములు చెప్పునుగాని ఇష్టమువచ్చినటుల తినుమని, అనుభవింపుమని చెప్పలేదు. ఆ వేదమునకు సర్వమును పరిత్యాగముచేయుటే ముఖ్యాభిప్రాయమని తాత్పర్యము.

**"నిస్సంగత్వే నిర్మోహత్వం, నిర్మోహత్వే నిశ్చలతత్త్వం నిశ్చలతత్త్వే జీవన్ముక్తిః"** అను ఆచార్యోక్తి చొప్పున దారపుత్త్రాదులయందభిలాష వదలగానే భోగేచ్ఛలయందుఁగల మోహము వీడుచున్నది. ఆ మోహమువదలగానే విషయరహితుఁడగుటవలన నిర్మలజ్ఞానము కలుగుచున్నది. అట్టి జ్ఞానము కలవాఁడు జీవన్ముక్తుఁడని భావము.

**అవ :–** విధి నిషేధములను గుఱించి వివరించుచున్నారు.

**మ॥ క్రతుశేషామిషమద్యసంగ్రహణ మాఘ్రాణింపఁ బుత్త్రార్థమై**
**ఋతువేళఁ సతిఁ జేరఁ జాలు నివి సత్కృత్యంబు లంచు న్గియా**
**హితమై వేదము పల్కుఁ జూడు మిలయం దిచ్ఛ ల్వెస న్రోచి స**
**ద్వ్రతకర్మందివటుల్ చరింతు రటుల న్వర్తిల్లు మామోదివై॥ 78**

**టీకా :–** ఇలయందుఁ=భూమియందు, క్రతుశేషామిషమద్యసంగ్రహము–క్రతుశేష=యజ్ఞ శిష్టములైన, అమిష=మాంసము, మద్య=కల్లుకు ప్రతినిధియైన సోమలతరసమును, సంగ్రహణము=పరిగ్రహణము, ఆఘ్రాణింపఁ=వాసన చూచుటయును, పుత్త్రార్థమై= సుతోత్పత్తికై, ఋతువేళఁ=ఋతుకాలములయందు, సతిఁ=భార్యను, చేరఁ= కలియుటయును, చాలుఁ=చాలును, ఇవి=ఈ కార్యములు, సత్కృత్యములంచుఁ=మంచి



కార్యములని, క్రియాహితమై=కర్మకాండమున నొప్పిదముగా, వేదము=శ్రుతి, పల్కుఁ= వచించును, సద్వ్రతకర్మందివటులు–సత్=శ్రేష్ఠములైన, వ్రత=కృచ్ఛ్రచాంద్రాయణాది వ్రతములు సలిపెడువారును, కర్మంది=కుటీచక బహూదకాది సన్న్యాసులును, వటులు= బ్రహ్మచారులును, ఇచ్ఛలు=(ముందుచెప్పఁబడిన మధుమాంస భక్షణభోగములయందలి) కోరికలు, వెసఁ=శీఘ్రముగా, త్రోచి=విడిచి, చరింతురు=ప్రవర్తింతురు, చూడుము=(వారు గృహస్థులచేత పూజ్యులై యుండుటను) నీవు కనుము, అటులన్=ఆ ప్రకారము, ఆమోదివై= బ్రహ్మానందముగలవాఁడవై, వర్తిల్లుము=ప్రవర్తించుము.

**తాత్పర్యము :–** వేదము భూమియందు కల్లుకు ప్రతినిధియైన సోమపానమును పశుపురోడాశమును ఆఘ్రాణింపుమనియు, ధర్మప్రజార్థమై ఋతువైన ఐదవదినమందు తనసతిని కూడుమనియు, ఈ కార్యములు కర్మకాండమునకు ఒప్పిదముగాఁ జెప్పెనుగాని సర్వము త్యజించిన వ్రతనిష్ఠులను సన్న్యాసులను బ్రహ్మచారులనుచూచి, ముందుచెప్పిన మధుమాంసభక్షణ భోగములయందలి కోరికలను పరిత్యజించి బ్రహ్మానందము గలవాఁడవైయుండుమని తాత్పర్యము.

**అవ :–** పరస్పరవిరోధముగల జ్ఞానాజ్ఞానములు రెండును ఏకమై జగత్సృష్టి యెట్లొనరించునని శిష్యుఁడడుగుచున్నాఁడు.

**మ॥ జగదాకారజడంబు కర్మతతికిఁ సఖ్యంబగు న్దానికిఁ**
**బగయౌ నొండగుజ్ఞాన మిందుకళతోఁ బ్రచ్ఛన్నమై కందుసో**
**యగమై కూడినజోకఁ జేరి యవి వ్యోమాదిప్రపంచం బహో**
**తగునాఁ జేయ గురూత్తమా! తెలుపుమీ తాత్పర్య మింపొందఁగాన్. 79**

**టీకా :–** గురూత్తమా=గురుశ్రేష్ఠుఁడైన నా యాచార్యుఁడా, జగదాకారజడంబు–జగత్= (పుట్టుచు, గిట్టుచునుండు నామరూపాత్మకమయిన) లోకముయొక్క, ఆకార=స్వరూపము గల, జడంబు=అజ్ఞానము, కర్మతతికిన్=విధినిషేధకామ్యప్రాయశ్చిత్తములతోఁ గూడిన సత్క్రియాసమూహమునకు, సఖ్యంబు=మైత్రి, అగున్=అగును, దానికిఁ=ఆ యజ్ఞానమునకు, ఒండగు=ఏకస్వరూపమైన, జ్ఞానము=యథార్థవస్తుపరిజ్ఞానము, పగయౌన్ =విరోధమగును, అవి=ఆ జ్ఞానాజ్ఞానములు రెండును, ఇందుకళతోఁ–ఇందు=చంద్రుని యందలి, కళతోఁ=కలతో, కందు=సల్పు, ప్రచ్ఛన్నమై=మాటుపడి, సోయగమై= సొగసుగలదై, కూడినజోకఁ=చేరినరీతిగానే, చేరి=కలసి, వ్యోమాదిప్రపంచంబు=ఆకాశము మొదలైన జగమును, చేయఁ=చేయుటకు, తగునా=చెల్లునా, అహో=ఆశ్చర్యము, ఇంపొందఁగాఁ=ఆనందముపొందులాగున, ఈ తాత్పర్యముఁ=ఈ తాత్పర్యమందలి యర్థమును, తెలుపుము=తెలియఁజేయుము.

యుండఁగ౯=చంపఁబడినవారైయుండఁగాను, చూడమే=మనము చూడమా, అట్లు=ఆ ప్రకారము, ఆజడోద్భూత కర్మతతులు–ఆ=ఆ యొక్క, జడ= అజ్ఞానముచేత, ఉద్భూత=పుట్టిన, కర్మతతులు=క్రియాసమూహములు, మానుష తంత్రములు= మనుష్యులచేతఁ జేయఁబడిన నిర్ణయములు, సు=లెస్సయగు, మతి=జ్ఞానము, ఆత్మక్రియా రూపము=ఆత్మతంత్రము, ఔ౯=ఔను.

**తాత్పర్యము :–** కుమారా! అతిశయమయిన మనస్సునందు అజ్ఞానము, జ్ఞానము పుట్టెను. ఎల్లప్పుడు ఆ రెంటికిఁబగయెందుకుఁ గలిగెననఁగా, ఒక గర్భమందుఁ బుట్టిన అన్నదమ్ములు ఒకనిచే నొకఁడు చంపఁబడియుండుటను మనము చూడలేదా? ఆ ప్రకారమే అజ్ఞానము చేత నేర్పడు కర్మతతులు, మానుషతంత్రములు, జ్ఞానము, ఆత్మవస్తుతంత్రము ఈ రెండును ఎటులనౌనని తాత్పర్యము.

**అవ :–** యోగజ్ఞానముల తారతమ్యములను దిగువవచ్చెడు రెండు పద్యములచేత శిష్యునకుఁ దెలియఁజేయుచున్నారు.

**మ॥ తగుఁ గర్మంబులు సేయఁ బాయ మఱి వ్యత్యాసంబుగాఁ జల్ప న**
**ట్లగునో జ్ఞానము పూర్ణమై నెగడు సత్యంబౌటఁ దద్జ్ఞాన మి**
**జ్జగతి౯ యోగము లాఁతియౌ నొకటి వ్యాజంబొప్ప వేఱొండుగా**
**నొగి భావించుట ధ్యాన మందు రదియే యోగం బగు౯ జ్ఞాన మా**
**త్మగుహ న్దోఁచి వెలుంగుఁ గాన ఋతమధ్యాసంబు గా దెంతయున్. 84**

**టీకా :–** ఇజ్జగతి౯=ఈ భూమియందు, కర్మంబులు=(వేదోక్తకులాచార) సత్కర్మములు, చేయ౯=ఒనర్చుటకును, పాయ౯=విడుచుటకును, మఱి=వెండియు, వ్యత్యాసంబుగా౯= వ్యత్యస్తముగా, చల్ప౯=చేయుటకును, తగు౯=ఒప్పును, జ్ఞానము=బ్రహ్మ స్వరూపమైన జ్ఞానము, అట్లగునో=ఆ ప్రకారముచేయుటకును తారుమాఱుగాచేయుటకును విడుచుటకును తగునా, సత్యంబౌట౯=దేశకాలవస్తుపరిచ్ఛేదశూన్యమగుటచేత, పూర్ణమై= అంతటనిండినదై, నెగడు౯=తేజరిల్లును, తద్జ్ఞానము=ఆ బ్రహ్మజ్ఞానమనునది, యోగము= కర్మయోగమనునది, లాఁతియౌ౯=వెవ్వేఱగును, ఒకటి౯=ఒక పదార్థమును, వేఱొండుగా౯ =మఱియొకటిగాను, ఒగి౯=క్రమముగా, భావించుట=భావనచేయుట, ధ్యానమందురు= ధ్యానమని చెప్పుదురు, అదియే=ఆ ధ్యానమే, యోగంబగు౯=యోగమను పేరుగలది యగును, జ్ఞానము=జ్ఞాన మనునది, ఆత్మగుహ౯=అంతఃకరణమను గనియందు, తోఁచి=పుట్టి, వెలుంగు౯=ప్రకాశించును, కాన౯=కాఁబట్టి, ఎంతయు౯=తద్దయు, అధ్యాసంబు గాదు=కల్పితముగాదు, ఋతము=యథార్థమగును.

**తాత్పర్యము :–** లోకమందు పుణ్యకార్యములు చేయుటకును, చేయకుండుటకును,



**కర్మ నావిద్యాం వినివర్తయేత్, విద్యావిద్యాం నిహంత్యేవ తేజస్తిమిరసంఘవత్”** అను శ్లోకార్థము చొప్పున కర్మకును, అజ్ఞానమునకును విరోధము లేనందున కర్మ అజ్ఞానమును పోఁగొట్టఁజాలదు. జ్ఞానము అజ్ఞానమును గొట్టివేయుచున్నది. ఇందులకు దృష్టాంతము. పటము పటాంతరంబునకు విరోధిగాదు గాన దాని నెటువలె చెరచక బలపఱచుచున్నదో ఆ తీరున కర్మ అజ్ఞానమునకు విరోధి గాదు కనుక దానింబోఁగొట్టక వృద్ధిపఱచుచున్నది. మఱియు అమావాస్యనాఁటి రాత్రియందు కలిగిన మేఘావరణము ఆ యమావాస్య చీఁకటిని పోఁగొట్టక వృద్ధి చేసిన తెఱఁగున కర్మం బజ్ఞానమును ప్రబలించుచున్నది. ఎట్లనఁగా ఆ చీఁకటియందు దారిఁబట్టిపోయెడి మనుజునకు పశువు లెదురుగావచ్చిన, వానిలో ఎద్దని, ఆవని తెలియక సాధారణముగ మృగములనియు, మనుష్యులెదురైన బ్రాహ్మణుఁడని, శూద్రుఁడని తెలియక సాధారణముగ మనుష్యులనియుఁ దోఁచును. ఆ చీఁకటిలో మబ్బుకూడా చేరిన సామాన్యముగాఁ దోఁచిన పశ్వాదులు సహా తెలియకపోవును. అదే దీరున కర్మ అజ్ఞానమును వృద్ధి చేయును. ఆత్మయందు అవిద్యయును, అజ్ఞానంబును కూడియుండుట వలన ముందు చెప్పిన చొప్పున దానిచే అపంచీకృత పంచమహాభూతముల వలనఁ గల్పింపఁబడిన సూక్ష్మశరీరము స్థూలశరీరంబుతోఁ గూడి సర్వకర్మములను జేయుచున్నది. ఇట్లు శరీరత్రయంబు కార్యమై పృథివ్యప్తేజోవాయ్వాకాశములు కారణములై ప్రత్యక్షముగఁ గనుపడుచుండ వేదాదులయందు వక్కాణింపఁబడిన అద్వితీయపరబ్రహ్మము తానని యెట్లు చెప్పఁదగుననఁగా వ్యష్టిసమష్ట్యాత్మకమగు శరీరత్రయమనెడి ప్రపంచము ఆ యాత్మయందారోపింపఁ బడియున్నందున రజ్జుస్వరూపం బెటులనిలిచెనో ఆ విధమున ఆత్మయందారోపింపఁ బడిన జగత్తునకు ఆత్మతప్ప వేఱొకవస్తువులేదు గాన ఆ యాత్మ యద్వితీయుఁడగు చున్నాఁడు. కాఁబట్టి అద్వితీయపరిపూర్ణ సచ్చిదానందస్వరూపుఁడైన ఆత్మ తాననియు తనకంటె భిన్నముగ భ్రాంతిచేఁ దోఁచెడి జగత్తు మిథ్యయనియు నెవ్వఁడెఱుఁగు చున్నాఁడో వాఁడే జీవన్ముక్తుఁడని వేదాంతసిద్ధాంతము.

మిథ్యయనఁగా రజ్జువందలి సర్పమువలెను, సుషుప్తియందలి స్వప్నమువలెను, ఎండమావులయందలి నీళ్ళవలెను, కాలిన వస్త్రమువలెను తోఁచెడి భ్రమ. ఇది పంచ విధంబులు. బింబప్రతిబింబదృష్టాంతముచేత నొక్కటియని తెలిసికొనక తటస్థేశ్వరునికిని ప్రత్యగాత్మకును భేదబుద్ధిగలుగుట మొదటిభ్రమ. స్ఫటిక లోహితోపమానముచేత ఆత్మయందుఁ దోఁచెడి కర్తృత్వాద్యభిమానములు అబద్ధమని యెఱుఁగక యథార్థమని నమ్ముట రెండవభ్రమ. ఘటమఠాకాశముల దృష్టాంతమువలన శరీరత్రయమున భిన్నభావము వదలకయుండుట మూఁడవభ్రమ. రజ్జుసర్పోదాహరణముచే జగత్కర్తయగు పరబ్రహ్మము తానని యెఱుఁగక వికారత్వముఁ జెందుట నాల్గవభ్రమ. స్వర్గలోక

దృష్టాంతముచేత కారణాదభిన్న ప్రపంచము భిన్నముగా నున్నదని యెంచుట ఐదవభ్రమ. ఈ భ్రమలు అజ్ఞానంబువలనఁ గలుగునవి గనుక వానిని నిర్వికల్పసమాధిచే నశింపఁ జేయవలయునని భావము.

**శ్లో॥ అంతఃపూర్ణో బహిఃపూర్ణః పూర్ణకుంభ ఇవాంబరే।**
**అంతశ్శూన్యో బహిఃశూన్యః శూన్యకుంభ ఇవాంబరే॥** – అను స్మృత్యర్థము నందలి భావన కలిగియుండుట **నిర్వికల్పసమాధి** యనఁబడును.

**అవ :–** వృత్తిరూపజ్ఞానము జగద్రూపమగు అజ్ఞానమును నశింపఁజేయు విధమును దృష్టాంతపూర్వకముగఁ దెలియఁజేయుచున్నారు.

**మ॥ పగయై సుప్తి దహింప కజ్ఞత స్వరూపప్రజ్ఞ తా వృత్తియై**
**మిగుల న్దాని దహించు టెట్టులన సన్మిత్రస్థితోష్ణద్యుతుల్**
**జగతి న్గాల్పక తచ్ఛిలం దగిలి భాస్వద్వహ్నియై కాల్చు నా**
**పగిది న్వృత్తి దహించు దృశ్యమయమై భాసిల్లు నజ్ఞానమున్. 81**

**టీకా :–** స్వరూపప్రజ్ఞ=స్వరూపజ్ఞానము, పగయై=విరోధముకలదై, సుప్తిన్=సుషుప్త్యవస్థ యందు, అజ్ఞతన్=అజ్ఞానమును, దహింపక=కాల్పక, తాన్=తాను, వృత్తియై=వృత్తిజ్ఞాన రూపమై, దానిన్=ఆ జగద్రూపమైన అజ్ఞానమును, మిగులన్=మిక్కిలి, దహించుట= కాల్చుట, ఎట్టులనన్=ఏలాగనఁగా, సన్మిత్ర...స్థితుల్–సత్=శ్రేష్ఠమైన, మిత్ర=సూర్యుని యందు, స్థిత=ఉన్నట్టి, ఉష్ణద్యుతుల్=తీక్ష్ణకిరణములు, జగతిన్=లోకమును, కాల్పక= దహింపక, తచ్ఛిలన్=ఆ సూర్యకాంతపు ఱాతియందు, తగిలి=పడి, భాస్వద్వహ్నియై– భాస్వత్=ప్రకాశించుచుండెడి, వహ్నియై=అగ్నియై, కాల్చున్=ఏర్చును, ఆ పగిదిన్=ఆ లాగున, వృత్తి=వృత్తిరూపజ్ఞానము, దృశ్యమయమై=నామరూపాత్మకజగద్రూపమై, భాసిల్లు=వెలిఁగెడి, అజ్ఞానమున్=అవివేకమును, దహించున్=నశింపఁజేయును.

**తాత్పర్యము :–** స్వరూపజ్ఞానము విరోధముగలదైయుండియూ సుషుప్త్యవస్థయందు అజ్ఞానమును కాల్చక తానువృత్తిజ్ఞానరూపమై ఆ జగద్రూపమైన యజ్ఞానమును దహించుట యెట్టులనఁగా సూర్యునియందుండు ఉష్ణకిరణములు లోకమును గాల్పక సూర్యకాంతపు ఱాతియందుఁదగిలి అగ్నియై జగత్తును గాల్చును. ఆ ప్రకారమే వృత్తిరూపజ్ఞానము జగద్రూపమైన అజ్ఞానమును నశింపఁజేయునని తాత్పర్యము.

**అవ :–** అంతఃకరణమందుఁబుట్టిన సత్కర్మములు వృత్తిజ్ఞానము అనువానిలో వృత్తి జ్ఞానమునకు శ్రేష్ఠమైన పూర్ణజ్ఞానమని యేల పేరుపెట్టఁబడెనని శిష్యుఁడడుగు చున్నాఁడు.



**మ॥ కరణప్రత్రయజన్మకార్యములు సత్కర్మంబులౌ వృత్తియున్**
**స్థిర నంతఃకరణోద్భవంబె కద సాచివ్యంబె యౌ వానికిన్**
**హరియింప న్దగవో యవిద్య నవి సత్యాచార్య! యావృత్తికిన్**
**వరవిజ్ఞాన మటంచుఁ బేరిడిన భావం బేమి తెల్ప న్దగున్. 82**

**టీకా :–** సత్యాచార్య=త్రిపరిచ్ఛేదమైన పరబ్రహ్మవస్తువును దెలిసి శిష్యప్రశిష్యులకు బోధించెడి శక్తిగల గురుమూర్తీ, స్థిరన్=భూమియందు, కరణప్రత్రయ=(కాయిక వాచిక మానసికము లనెడి) త్రివిధసాధనములవలన, జన్మ=పుట్టిన, కార్యములు= (వేదవిహితములైన) పనులు, సత్కర్మంబులౌన్–సత్=శ్రేష్ఠములయిన, కర్మంబులు=క్రియలు, ఔన్=అగును, వృత్తియున్= వృత్తిజ్ఞానమును, అంతఃకరణోద్భవంబె కద–అంతఃకరణ=మనమునందు, ఉద్భవంబె కద= పుట్టినదే కదా, వానికిన్=ఆ సత్కర్మములకు, సాచివ్యంబె యౌన్=మిత్రత్వంబు గలదియే యగును, అవి=ఆ సత్కర్మములు, అవిద్యన్=అజ్ఞానమును, హరియింపన్=పోఁగొట్టుటకు, తగవో=చాలినవి కావా, ఆ వృత్తికిన్=ఆ అంతఃకరణోద్భవమైనవృత్తికి, వరవిజ్ఞాన మటంచున్–వర=శ్రేష్ఠమైన, విజ్ఞానమటంచున్= పూర్ణజ్ఞానమని, పేరు=నామము, ఇడిన= ఉంచినట్టి, భావంబు=అభిప్రాయము, ఏమి=ఏమి, తెల్పన్దగున్=తెలియఁబఱచవలసినది.

**తాత్పర్యము :–** సద్గురుమూర్తీ! భూమియందు కాయిక, వాచిక, మానసికములనెడి సాధనముల మూఁటివలనఁ బుట్టిన సత్క్రియలును వృత్తిజ్ఞానమును అంతఃకరణమునందు పుట్టినవియే గనుక ఆ సత్కర్మములకును వృత్తిజ్ఞానమునకును మిత్రత్వము కలది యగును. ఆ సత్కర్మములు అజ్ఞానమును నశింపఁజేయుటకు చాలినవిగావా? అట్టి యంతః కరణమునకు శ్రేష్ఠమైన జ్ఞానమని పేరిడిన అభిప్రాయమును దెలియఁజేయవలయునని తాత్పర్యము.

**అవ :–** ముందడిగిన ప్రశ్నకు ఉత్తరముఁ జెప్పుచున్నారు.

**మ॥ వితతాంతఃకరణంబున న్జడము సంవిద్రూపము న్గల్గె సం**
**తత మా రెంటికి వైర మేల యనఁ బుత్రా! చూడమే సోదరు**
**ల్హతులై యుండఁగ నొక్కరుం డొకనిచే నట్లా జడోద్భూతక**
**ర్మతతు ల్మానుషతంత్రము ల్సుమతి యాత్మప్రక్రియారూపఔ. 83**

**టీకా :–** పుత్రా=కుమారా, వితతాంతఃకరణంబునన్–వితత=అతిశయమైన, అంతః కరణంబునన్=మనస్సునందు, జడము=(కర్మరూపమైన) యజ్ఞానమును, సంవిద్రూపమున్= బ్రహ్మజ్ఞానమును, కల్గెన్=పుట్టెను, సంతతము=ఎల్లప్పుడు, ఆ రెంటికిన్=ఆ యజ్ఞాన సుజ్ఞానములకు, వైరము=పగ, ఏలయనన్=ఎందుకనఁగా, సోదరులు=ఏకగర్భ సంభూతు లైన యన్నదమ్ములు, ఒకనిచేన్=వారిలో నొకనిచేత, ఒక్కరుండు=మఱియొక్కఁడు, హతులై

